కాఖండమునందు నీశాన్యభాగమున నేడో యొక క్రైస్తవజాతి కలదని బహుకాలముగ గాలివార్తగ వినుచుండిన పోర్చుగీసుమతాచార్యులు క్రీ. శ. ౧౪౯౦-వ సంవత్సరమున నబిసీనియాను కనుగొనిరి. వీరికిని నీగస్సునీగసునకును (ఇది అబిసీనియారాజు బిరుదము; రాజులకురాజని యర్థము) స్నేహము కుదిరెను. క్రీ. శ. ౧౫౨౮ మొదలు ౧౫౪౦ వఱకును ప్రచండయోధుఁడగు తురుష్కుఁడు మహమ్మదుగ్రాగనునకును అబిసీనియా చక్రవర్తికిని జరిగిన పోరాటములో పోర్చుగీసువారు నీగసునకు సాహాయ్యపడిరి. హిందూదేశమునుండికూడ సైన్యము లనుపఁబడియెను.

మహమ్మదుగ్రాగన్ గుండుదెబ్బచే మృతుఁడగుట వలన నీగసునకు సంపూర్ణజయము కలిగె. తదనంతరము ఇతనికిని పోర్చుగీసు క్రైస్తవాచార్యుఁడు బర్ముడసునకునువివాదంబయ్యె. బర్ముడసు అబిసీనియా వదలివచ్చువాఁడాయె. క్రీ. శ. ౧౬౩౨-వ సంవత్సరము వఱకును గొంద ఐరోపియనులు అబిసీనియాకుఁబోయి రాజును స్నేహము చేసికొనుచు వచ్చిరి. కాని ఆటుతరువాత నొక శతాబ్దకాలము ఐరోపియను లేరును అబిసీనియా లోనికిఁ బోరైరి.

౧౬-వ శతాబ్ద మధ్యమునుండి ఆ దేశమునకు దక్షిణము నందుండిన 'గాలాలు' అనుజాతివారు అల్లనల్లన లోనికిఁ జొచ్చి దేశము నాక్రమించు కొనిరి. ౧౮-వ శతాబ్దాంతమున చక్రవర్తి వారిచేతులలోజిక్కి క్రమముగ తగ్గుచువచ్చుచుండిన చక్రవర్తి బలము సంపూర్ణముగ నశించె. తత్కాలమున నేస్వామింతుఁడు బలవంతుఁడగు వాఁడైన చక్రవర్తిని వశపఱచుకొని అతనిమంత్రియను పేరిట రాజ్యమేలుచుండెను. ఈప్రకారము ౧౮౫౫-వ సంవత్సరమువఱకు ననేకరాజులయిరి. ఆ సంవత్సరమున విజ్కాసాయను వాఁడు మూఁడవ థియొడోరను బిరుదముతోఁ జక్రవర్తియయ్యెను. ఇతఁడు అబిసీనియాయందు పశ్చిమభాగమున నుండు కొరామండలమున ౧౮౧౮ లో జన్మించెను. ఇతని పినతండ్రి డంబియా, కొరా పెల్గాయను మండలములకు గవర్నరుగా నుండెను. అతని మరణానంతరము విజ్కాసా కొర్రా మండలమునకు మాత్రము పాలకుఁడుగ నేమింపఁబడియెను. ఇదియతనిం దృష్టి పరపదయ్యె. కొన్ని ప్రయత్నములు చేసి ౧౮౫౫ లో నితఁడు రాజయ్యెను. మిక్కిలి విపరీతమగు విజిగీష గలవాఁడయి కార్యము సూపుచు వచ్చినందున నీతఁడు నాశనమునకు మార్గ మేర్పఱచు కొనువాఁడాయె. మొదటమొదట నీతనికి బ్రిటీషువారికి మిక్కిలి స్నేహముండెను. కాని ౧౮౬౨-వ సంవత్సరమున నితఁడు ఆంగ్లేయ చక్రవర్తినికి వ్రాసి పంపిన యుత్తరమునకు జవాబే రానందున సహజముగ కోపియగు నీథియొడోరు బద్ధవైరుమాయెను. ఎన్ని ప్రయత్నములు చేసినను ఈవైరము మానినదిగాదు. ౧౮౬౭-వ సంవత్సర

ముఖ నిర్తనికిని ఆంగ్లేయులకును విగ్రహము ప్రారంభమాయెను. థియొడోరు బహాదుర్షాయము జోరి సంధి చేసికొన ప్రయత్నించి విఫలమనోరథుడై తప్పించుకొని పారిపోవ ప్రయత్నించి దానికిని మార్గము కానక ఆత్మహత్య చేసికొనెను. మార్గమును ఆంగ్లేయుల స్వాధీనమాయెను. ఈయుద్ధమున వీరికి సాయముచేసిన టిగ్రీపాల కుడగు కాస్సేయనువాడు జోహాన్న సురాజను పేరిట అబిసీనియా చక్రవర్తియయ్యె. ఆంగ్లేయులంతటితో అబిసీనియా వదలిరి. జోహాన్నసు ౧౮౮౯-వ సంవత్సరమున యుద్ధమునందు హతుడయ్యెను. యూరోపునందు బలవత్తములగు ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, పోర్చుగీసు, బ్రిటీషుజాతులవారు ఆఫ్రికా ఖండమును స్వాధీనులు కయ్యును తుదకు ఆక్రమణ కయ్యును విభాగించికొని యుండుట తటస్థించెను. అపుడు అబిసీనియా ఇటాలియనుల భాగమయ్యె. వారిసాయమున షోవారాజగు రెండవ మెనెలిక్కు అబిసీనియా చక్రవర్తియయ్యెను. ఇటాలి యనులకు లోబడినదని పేరొక్కటియకాని అబిసీనియా ఎప్పుడును వారికి జెందినదిగాదు. ౧౮౯౬-వ సంవత్సరమున ఇటాలియనులనోర్చి మెనెలిక్కు సర్వస్వాతంత్ర్యము వడసెను. ౧౮౯౭-వ సంవత్సరమున ఆంగ్లేయులతో స్నేహసంధి చేసికొనియె. ౧౮౯౭, ౧౯౦౨-వ సంవత్సరములలో అబిసీనియా, ఇరిట్రియా సూడానుల సరిహద్దులు నిశ్చయపఱచుకొను సంధులు జరిగెను.

ఇది నిరంకుశ ప్రభుత్వము. అయినను ౧౯౦౭-వ సంవత్సరము నవంబరు నెలలో చక్రవర్తి మెనెలిక్కు అబిసీనియాకు ఒక విధమైన సాంఘిక ప్రభుత్వము నొసంగెను. చక్రవర్తి అందఱకు పై నధికారి. అతనికి సాహాయ్యము చేయుటకై యొక సభయుండును. సామంతరాజ్యములలోని రాజులును, మహా మండలముల పాలకులును ఇందు సభాసదులుగనుందురు. యూరోపు దేశములందలి మంత్రిమండలముల (Cabinet) వంటి మండలములుగూడ నీరాజుచే స్థాపింపబడెను. ఇతని యొద్ద ౧౫౦౦౦౦ సైన్య మెప్పుడు నిలువయుండును. అందలి సైనికులు యూరోపియను సైనికులవలె యుద్ధవ్యూహములను చక్కగ నేర్చి నూతనశస్త్రాస్త్రముల గలిగియుండును. ఈదేశమిదివఱకు నాగరకతలో వెనుకబడ్డను ప్రస్తుతము జాతీయభావమందు జక్కగ వికసించినది. ఇచ్చటివారు పూర్వము విశేషము విద్యావంతులు గాకపోయినను ౧౯౦౭-వ సంవత్సరమున పురుషులందఱును తప్పక చదువ కొనవలయునను చట్టము చేయబడినది.

[గా. హ.

**అబుల్ ఘాజీ బహాదర్.** (౧౬౦౫-౬౩) ఇతడు ఖైవా ప్రభుత్వమును కుమారునకు నొప్పగించి చెంగిస్ ఖాను యొక్క వంశచరిత్రమును వ్రాసెను. అయ్యది జెర్మనీ, ఫ్రెంచి భాషలలోనికి తరువాత తర్జుమా చేయబడినది.